# రత్న మాణిక్యాలు

మధుర మధురమైన విశ్వమానవజీవిత వసంతానికి మా "కల్పతరువు" తయారైంది. విజ్ఞాన శకుంతాలు నానా దిగంతాలనుంచి వచ్చి అమృతకవితా గానం ఆలాపిస్తూ దీని సహస్రశాఖాగ్రములమీద మకరందవర్షం క్రుమ్మరిస్తై.

ఇది రసమనోహరలోకం. విశ్వమహాజన మనస్తత్త్వాలు మార్పుల్లోకి వస్తున్నప్పుడు వివిధరసప్రవాహాలు దూకులు పెడుతూ వుంటై.

ఇటువంటి విశ్వమహాజన పరిణామదశ రసగంగా ప్రవాహాల్లోనే యీ రామాయణ భారతాలు సారవంతమైన లంకభూములైనై. వీటిమీదే నేటి దాకా యెందరెందరో సాహిత్యకర్షకులు బంగారుపంటల్ని రత్నాలపంటల్ని పండించి రాసులు పోస్తున్నారు. ఈ "కల్పతరువు" కూడా యీ పొలాలగట్టు మీదే తలెత్తింది. దీని కాఁపు కొంత క్రొంగ్రొత్త తరహాగా దిగింది.

అసలు కష్టసుఖాలు సమత్వదృష్టితో గ్రహించి, సహించి జీవితాన్ని నడుపుకొంటున్నవాఁడు వురుషోత్తముఁడౌతాడు. అంత పురుషోత్తముఁడు తదేక దీక్షతో తాను విశ్వకళ్యాణం కొఱకు ఏదైనా ఆలోచించి అన్వేషించడానికి దిగినప్పుడు చెప్పనలవికాని కష్టాలపాలై దిక్కుమొక్కులేని అడవుల్లో పడతాడు. అంతటి ఘోరారణ్యకష్టాల్గూడా తట్టుకున్నప్పుడే గమ్యస్థానం తనకు చూపించటానికి, తనను కృతార్థుణ్ణి గావించటానికి, విశ్వవిజ్ఞాన ఫాలలోచనుడైన జీనియస్ తోడుపడతాడు. కూలి రైతు శ్రమజీవుల కష్టంతో స్వర్గలోకాన్ని భూలోకానికి తెచ్చేటందుకు "కారల్ మార్క్స" తత్త్వవేత్త తత్త్వాన్వేషణ చేసి చేసి పడరానిపాట్లు పడి పడి తుట్టతుదకు తనకు "ఏంగెల్సు" మహామహుడు తటస్థపడి తోడుపడి తనను కృతార్థుణ్ణి చేసినట్లుగా, నేను చూపిస్తున్న రామాయణ కథామార్గంలో పడరానిపాట్లు పడి పడి సీతాన్వేషణకై భయంకరారణ్యం గాలిస్తున్న శ్రీరామచంద్రుడికి త్రిలోచనుడైన శివుడు వీరాంజనేయుడుగా తటస్థపడి, సహాయపడి గమ్యస్థానానికి చేరుస్తాడు. అంటే మానవుడు నానా కష్టాల్ని

సహించి చెక్కుచెదరని ఏకైకలక్ష్యంతో నడుస్తున్నప్పుడు పురుషోత్తము డౌతా డన్న మాట. ఇటువంటి పురుషోత్తముడే అవతారమూర్తియై విశ్వమహాజన శాంతి సౌఖ్య జీవనాలకు దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపన చేస్తాడు. ఇటువంటి అవతారమూర్తికి ఫాలాక్షుడైన పరమశివుడు దాస దాసానదాసుణ్ణని బహువినమ్రుడై దగ్గరకుచేరి సేవచేస్తుంటాడు.

అసలు సుగ్రీవుడు తనదగ్గర బంటుగావున్న ఫాలాక్షుడైన హనుమంతుణ్ణి తాను గుర్తించలేనంతకాలము బంటుగా వున్న హనుమంతుని కేవలం కోతిగా చూడబట్టి వాలిచేత తాను దెబ్బతిన్నాడు. ఆమాదిరి చూడబడిన హనుమంతుడు తన దివ్యజ్ఞానత్రిలోచనముతో శ్రీరామ లక్ష్మణుల్ని అవతారమూర్తులుగా తెలుసుకో గలిగాడు. అట్లాగే స్థితప్రజ్ఞత్వంతో పురుషోత్తములై దివ్యజ్ఞాన చక్షువుతో రామలక్ష్మణులు హనుమంతుణ్ణి పరమశివుడుగా గ్రహించారు.

ఈ లోకంలో కొంతమంది విశ్వమహాజనసేవకోసం ఏకైకలక్ష్యంతో పడరానిపాట్లు పడి అడవుల్లో పడిపతున్నప్పుడు పరమశివుడు ఏదో గ్రహించలేని రూపముతో వచ్చి దగ్గర దాస దాసాన దాసుణ్ణని చెప్పి అణకువతో సేవచేసి అపూర్వమైన సహాయం చేస్తున్నప్పుడు తెలుసుకోలేకపోతున్నారు. ఇది ప్రత్యక్షానుభవంతో చూచి చెబుతున్న విషయం.

భువన బృందావన కార్యసాఫల్యానికి నాకవితా సంస్థాన బృందారక బృందావన చక్రవర్తులైన ఆనందభోజులు, నవరత్నకిరీటరాజులు, విజ్ఞాన కల్పతరువులు, భాగవతోత్తములు, నిఖిల శాస్త్రవేత్తలు, మహా ఋషిపుంగవులు ఎంతోమంది అమృతరస గంగాధరులై యీ రామాయణ కల్పతరువులోని సుందర కాండమును ప॥గో॥జిల్లా తిరుమలాపుర శ్రీ భోగసుందర సీతారాములకు సమర్పించటానికి సహకార మార్గదర్శకులై విరాజిల్లినందువలననే శ్రీ గురుదేవుని కటాక్షం అక్షర నక్షత్ర భాగ్యపారిజాతమై శ్రీ జగజ్జనని ప్రసన్నమై నే నీ సుకృతాన్ని కల్పతరువుగా తయారుచేసుకొని భోగసుందర సీతారామస్వామి పాదకమలాలికి సమర్పించాను.

కం॥ గౌరీ పట్టణరాజా !
ఏరీ సాటింకనీకు నిలపై తులపై
ధారాళమ్ముగ జేతువు
ధారా ధర ధర్మభిక్ష దాతలు పొగడన్.

చం॥ జనకుడ వీవు దాశరథి సన్నిధి పెన్నిధి నై తివీవు నం
దనవనమై భవన్మనముధాత్రి పవిత్రము చేయవచ్చె జీ
వనము మహాజగజ్జనని పాదకృపారసమయ్యె, నాదు ద
ర్శనమె నిదర్శనమ్మని నిజమ్ముగ నమ్ముము నారసింహమా.

ఈ శుభకార్య సభాసమక్షంలో సమావేశమైన ఆబాల గోపాలానికి, భాగవతోత్తములకు శ్రీ భోగసుందర సీతారామస్వామి తల్లియైన శ్రీ సీతమ్మకి, ఈ కన్నతండ్రియైన శ్రీ లక్ష్మీనరసింహమునకు వీరి చి॥ పుత్ర పుత్రికారత్న మాణిక్యాలికి జగజ్జనని అనంత కృపారసభాగ్యము అమృతవర్షముగ• కురిపించి మురిపించుగాత.

శా॥ పూరాగా మృదుమాధురీరసము త్రేపుల్ వచ్చునట్లిచ్చి, సం
సారాంభోధి తరంగ డోలికలపై చక్కంగ నూగించి కీ
కారణ్యమ్ములఁ ద్రోసిమాతనుము, అవ్యాజ ప్రియంబుల్ ఉసేన్
శ్రీరాస్వామి యనుగ్రహించి శివుడై వెల్గించుతన్ నానుడుల్.

ఆంధ్రబెర్నార్డ్షా — వేదాంతకవి.

# పద్యాలు

సీ॥ గోదావరీ దివ్యపాదారవిందాలు
నక్షత్రకోటి వేదాక్షరాలు
గోదావరీ కావ్యకేదార తీర్థాలు
త్రిభువనభాగ్య గారాస్వరాలు
గోదావరీ నవ్యవేదాంత కవిదృష్టి
పారిజాతమరాళ భవ్యసృష్టి
గోదావరీరత్న నాదబిందు కిశోరి
ఆనందసౌఖ్య విజ్ఞానభేరి
తే॥ గీ॥ భువన బృందావనపురాణి కవనరాణి
భక్తిరస వాహినీ నాట్య బ్రహ్మవాణి
కల్పతరువు పెంచి భవాని కరుణవలన
రమ్యముగ నీకు నిడెగ శ్రీరామచంద్ర. 1

సీ॥ భద్రాద్రిరాముని వర్ణింపతరమటే
శృంగారకవి నవజీవకళలు ?
భద్రాద్రి శూరుని బాహుసౌందర్యంబు
రిపుకోటి దృష్టి గుర్తింపగలదె ?
భద్రాద్రి జనకుని పలుకులో మధురంబు
భక్తుల జిహ్వా కల్పతరువయ్యె
భద్రాద్రి ఘనచక్రవర్తి చాతుర్యంబు
సీతమ్మతల్లి నోచిన ధనంబు.
గీ॥ కవనశతపత్ర సుందరి కనులనిండ
పండు వెన్నెలపూచి కన్పట్టుచుండె
పొంగి గోదావరీ తల్లి పొర్లుచుండె
నాయదృష్ట మెంతటిదో కనంగవశమె. 2

ఉ॥ చక్కని రామచంద్రుని పసందుగజూచితి తల్లిపెద్ద పే
రెక్కిన శాంతిదాత వరియింపుము, నింపుము నాయశంబు న
ల్దిక్కులు మారుమ్రోగెడి సుధీజనవాక్యము పెళ్ళి పందిరై
జక్కులరేనితో ప్రజలు సంతసమందరె కావ్యకన్యకా ! 3

మ॥ కృతికన్యాపరిణేత దాశరథి, కళా కేయూరమాణిక్య స
న్నుత సౌందర్య ధరాపురంధరుడు గన్నుల్ పండువైనాడు సం
తత మానందపయోధిలో మునిగి విద్యాదక్షు డెవ్వాడు కీ
ర్తి నామాడ్కి కనండు, నాశవన పుత్రీరత్నమా కాంచుమా. 4

ఇతడే ఋష్వాదు భోగసుందరుడు, బ్రాహ్మీ బర్హిస్సామ్రాజ్య పం
డిత వేదండ కళామనోహరుడు, మాణిక్యప్రభు శ్రీపదా
మృత మాధుర్యరసాల-సాల-ఫల-వాల్మీకి ప్రపంచైక పా
లిత బృందావన కోకిలా ! కయిత కల్గిం రామున్నిం గొల్వుమీ. 5

23—12—52
తాడేపల్లిగూడెం.

ఆంధ్రబెర్నార్డ్షా — వేదాంతకవి.

# విజ్ఞాపన

నాచే రచింపబడిన యీ కల్పతరువులోని పద్యాలుగాని, భావాలుగాని, ప్లాట్లుగాని నా లిఖిత పూర్వకమైన అనుమతి లేనిదే ఎవ్వరూ, ఎక్కడా, ఎవ్విధముగా తమ స్వంత లాభాలకోసం ఏ వ్యాపారాల్లోను వాడుకొనగూడదు. అచ్చొత్తించకూడదు. దీనికి వ్యతిరేకించినవారు నా నష్టముక్రింద నేను తెచ్చు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

కవితాసంస్థానం
తాడేపల్లిగూడెం

ఇట్లు,
ఆంధ్రబెర్నార్డ్‌షా - వేదాంతకవి.

# సాక్షాత్కారం

శ్రీరామ లక్ష్మణులు లో
కారాధ్యులుగా సరణ్యా మా భూసుతకై
ఘోరశ్రమ గాలించుచు
హైరానయి వచ్చుచుండి రాశలపాలై 1

చెకచెక సాగుచుం గటికచీకటిలో
బడినట్టి బ్రహ్మ సృ
ష్టికిఁ దొలికోడికూఁత నవజీవముఁవోసి
ప్రయాసతోడ దా
రికిఁ గదలించుచుండఁగ స్మరించుచు
లేచిన కాకిగోలతో
ఠకమకమై ప్రభాత సుదతీమణి వచ్చె
విభూషితాంగియై. 2

కిష్కింధాపుర సార్వభౌముఁడగు
సుగ్రీవుండు పెన్భీతితోఁ
శుష్కీభూతశరీరుఁడై గడపి రోజుల్
ఋష్యమూకమ్ముపై
నిష్కాపట్యమనస్కులై చనెడి
క్షోణీపాలురం గాంచి త
త్కిష్కింధాపురి వాలియేమొ యని
చింతించెం భయభ్రాంతితో. 3

జీవములన్ని యింక నఱచేతికిఁ
గైకొని కుందుచున్న సు
గ్రీవుని జూచి మారుతి పరిభ్రమఁ
జెందకుఁడంచుఁ బల్కి త
ద్భూవరు లెవ్వరో కని విభూ!
యరుదెంతునటంచు నేగె వి
ద్యావినయమ్ములతో మృదుసుధారస
గానములతో వినమ్రుఁడై. 4

భువనము గోటనెత్తెడి యపూర్వ
మహాబలవంతుఁడై స్వధ
ర్మ విజయుఁడై జగాన హనుమంతుఁడు
నిర్మల రాజభక్తితో
స్తవములొనర్చి భద్రగిరిచంద్రుని
చల్లని ప్రేమభాగ్యముల్
కవనము లల్లి మంజులకళాస్పదు
గానములెల్లఁ జేసెరా. 5

కోరిక లేనివాఁ డయినగూడ
యజస్రము రామసేవతో
తీరిక లేనివాఁడయి, విధేయతగాఁ
గడగండ్లు సైచి మి
న్నేరులు లేపు వానరుని కే
సరుఁడై ననుగాని త్రాసులోఁ
బేరున కింక తూఁగఁగల వీరుఁడు
కాగలఁడా ధరిత్రిపై. 6

కడు సంరంభముగా నయోధ్యదార
యీ క్ష్మా రాజ్య పట్టాభిషి
క్తుఁడు కాఁబోయెడివేళ తండ్రి వరవాక్కుల్
బీరువోకుండ కా
అడవుల్ పట్టుటఁజేసి యింత కపిరాజై
వెల్గు వీరాంజనే
యుఁడు గానంబున రామభక్తిగల
ధుర్యుండై ప్రశంసించెనా! 7

రత్నమాణిక్యకిరణ తోరణమ్ములు
రామనామాత్మరధామనిధులు
వింధ్య హిమాలయ విద్యాధరఘనులు
భద్రాచలస్వామి భజనకరులు
గంగాతరంగ తురంగమాతంగాలు
పట్టాభిరాముని వారువాలు
కాంతారకమనీయ సంతానభాగ్యాలు
జానకీపతి వజ్రశాసనాలు

దివ్యబృందావనసరస్సు దిగులుపడెడి
రాఘవేంద్రచరణ సువర్ణకమలాలు
ప్రాణములు నా కటంచు పరవశమంది
యింత హనుమంతుఁ డడవి గల్లంతుపెట్టె 8

తరువుల్ సైతము భక్తిలోఁ బరవశత్వం
బొందెనో యేమొ, వా
నర శార్దూలముతో సమానముగ
బల్ నాట్యమ్ములం సల్పుచున్
గురుపించెం సుసువృష్టి రామవిభునిం
గొండాడి, తద్దివ్య సుం
దర సుస్నిగ్ధకిశోరమూర్తి యిఁకఁ
గంటంబడ్డ యెట్లుండునో. 9

ఫెళఫెళ చెట్టుచేమలు కపిప్రవము
ఖుం డొగఁబడ్డ వెంటనే
గళము ను విప్పి చెప్పిన వఖండ
మృదంగ తరంగ భంగిమం
బులు, సెలయేటి కన్నెలకు ; ముద్దులు
పూచెడిరీతిగా జయం
బులు మృదుగీతికామధురముల్
చిగిరించె కళాళకుంతముల్ 10

ఆ రాముఁ డెంతవాఁడో
ఆరామముగా నరణ్య మాహ్లాదముతో
వీరాంజనేయుఁ డెత్తఁగ
భేరీభాంకృతులుచేసె భీకరమృగముల్ 11

ఈ కపికుంజరుండు భజియించెడి
చల్లని రామనామ సు
శ్లోక సుధాస్రవంతి నవశోభితమై
ప్రవహించి సర్వ లో
కైక మనోజ్ఞమై గహనమెల్ల
మహేంద్రమహోత్సవంబుతో
నాకమొనర్చె దాశరథి నమ్మిన
తమ్ముఁడు వచ్చుచుండగా ॥ 12

సీతాన్వేషణకై సహోదరునితో
శ్రీరామచంద్రుండు వి
ఖ్యాత శ్రీ శ్రవణాలు సాచుకొని
ఘోరారణ్య మార్గశ్రమం
బేతన్మాత్రముగూడ చూచుకొన
కుం డేతెంచుచుండంగ, దా
పై తన్మారుతి రామగానమృదు
గీతాలాపనల్ తాకెరా ॥ 13

వినిపించి రామనామము
తనిపించి మనోజ్ఞగాన తారుణ్యము త
జ్జనకాత్మజ దిక్కుచ్చట
కనిపించని చనిరి వాగు కడువేగముతో॥ 14

రామా! సద్గుణధామ! నీ కరుణ
సంప్రాప్తించు టే జన్మకో
రామాయన్న కవీంద్ర సంస్తుతులు
శ్రీరాముండు తల్లక్ష్మణ
స్వామిం విన్మనె, సీతకంత మనిపించం
జొచ్చు విభ్రాంతినిన్
రామస్వామి పదారవిందములు
కాంతారమ్ము పూజింపఁగా॥ 15

సంగీతాగమదైవమైన హనుమ
స్వామి ప్రమోదమ్ముతో
పొంగుల్ వెట్టెడి రాగజాహ్నవి కళల్
పుష్పించి క్రొత్తావి గు
ప్పంగం గమ్మని పంచమస్వరముతో
భావించె రాముండు సా
రంగస్థాయిని జానకీరమణి
గాత్రంబంచు నాత్రంబులో॥ 16

శ్రీరామ దర్శనము మా
ఘోరారణ్యముల కెప్డు కూడునో యనుచున్
మారాము వెట్టు చిట్టుల
భూరమణుని నడ్డగించె పొదరిండ్లనోఁ॥ 17

సీతమతల్లి జాడ నరసీరుహా
నేత్రుఁడు చూడఁబోవు పె
ల్లాతురతో నికుంజనిలయావళినిం
బలిమాలి యెంతయో
చేతము తల్లడిల్లెయుసిం జనగా
హనుమన్న తీయు సం
గీతము డెంద మింక తతిగం కెతిగం
పెనుఅంపకోతగా॥ 18

మధుర మధురమైన మామిడిపండులో
రామనామము తీపి రాదురాదు
ఘుమఘుమలాడెడి కుసుమగుచ్ఛంబులో
రఘువీర గంధంబు రాదురాదు
తళతళా మెఱసెడి తారకాధిపతిలో
రామచంద్రుని చల్వ రాదురాదు
వడివడిగా దుమికెడి యేటి పరుగులో
రామకటాక్షము రాదురాదు

కేల నవలీల కోటి హిమాలయాలు
పాఱవైచెడి కోదండపాణి ముందు
మేదినీబలగర్వ సమీరుఁ డెవఁడు?
రామునికి రాముఁడే సాటి భూమిపైన॥ 19

అతఁడే నా యిలవేల్పు నిక్కముగ
నా కాతండె లోకైక స
న్నుత నమ్మోహన చక్రవర్తి యతఁడే
నూల్వాసి పేర్వాసి న్యూ
నతలేకుండ వెలుంగు నా భువన
మందారప్రసూనోదయ
ప్రతిభావంతుఁ డనంతకోటి జగదా
రాధ్యుండు రాముండురా॥ 20

ఇట్లాత్మారామస్తుతి
చెల్లక్క యొనర్చి మోడ్చి చేతులు కపి న
ప్రొల్లుండ రామచంద్రుఁడు
పాల్చె సాక్షాత్కరించె వరలక్ష్మణుతో॥ 21

వనచరుఁడైన వానరుఁడు భక్తి
రసాబ్ధి నిమగ్నుడై చెలం
గినకతముం బరాత్పరుఁడు కేవలముం
నరుడై మహాటవీ
వనరుహాకోటిమధ్య పలుబాముల
పాలయియున్న హేతువున్
గనుగొని విశ్వమోహనముగాఁ బులకించె
నజాండభాండముల్॥ 22

శిల లేడ్చి జీవనదులై
చెలువారెడి రామనామ జీవనములతో
బలశౌర్య భక్తి భాగ్యము
చలచిత్తపు కోతి కిచ్చి సాకినవే మా॥ 23

వాలము మూపుపైన కరవాలముగా
ధరియించి వీరలాం
గూలుఁడు కేలుమోడ్చి శతకోటి
హిమాలయ దేహపుష్టి మా
ర్మాలను దాచిపెట్టి కనుబొమ్మలు
నమ్రతనిచ్చు నొంటి మో
కాలును వంచి కూర్చుని జగాలు
చిగిర్చు జపాలు సల్పెరా॥ 24

ఈ హానుమంతుఁ డంత జగదేక
పరాక్రమవంతుఁడై మహా
బాహువులం వినమ్రతగ వంచి
నుతించి సహస్రవిశ్వ స
మ్మోహన రూపమైన సగుమోముని
రామునిగాంచి భక్తి సం
దోహము వెల్లువై దుమికి దూకిడి
గానముఁజేసె హాయిగా॥ 25

ఎన్ని యుగాలనుంచి గడియించిన
భక్తిరసప్రవాహమో
కన్నులపండువైన త్రిజగత్ప్రభు
వక్కడ కాలుమోపి లో
కోన్నతశక్తిఁ జూపి సుముఖోజ్వలుఁడై
తిలకించినంతనే
మిన్నును ముట్టె భీకర సమీరకుమార
వినోద వార్షముల్॥ 26

ఆ పవనాత్మజుండు కుసుమాంజలితోఁ
బ్రణతుల్ ప్రఫుల్లవా
ణీ పదకింకిణీమృదుఘృణీమకరంద
మరందబిందువుల్
తీపిగనిచ్చి మెచ్చుచు విధేయతగా
దరినిల్చి రామచం
ద్రా! పరమాగమాదిమునిరాజ
మహేంద్ర యటంచు మ్రొక్కెరా॥ 27

కోతిని రామచంద్ర! నినుగొల్చెడి
నిల్కడలేదు నీదు వి
ఖ్యాతచరిత్రగాంచి కొనియాడెడి
మంజులవాగ్విలాస మీ
కోతికి మచ్చుకైన కనుగొంట క
డెచ్చట కానరాదు; నం
ప్రీతిగ మోతునీమూపుపయి విశ్వముఁ
జూచెడి వేడ్కయున్నచో॥ 28

అడవులు పట్టి యే చదువులంటని
గిట్టని కోతిజాతిలో
జడుడను నేను రాఘవ! నిజమ్ముగ
నీ పదపంకజమ్ము లె
ప్పుడు తలఁదాల్చి పట్టి కరముల్
గలవాఁడను; నాదు రాకతో
గడగడలాడి వేడు తరుకాండము
విచ్చిన పూలగొంతుతో॥ 29

నేఁ డిటువంటి వానరుని
నీ వెటు లెంచి దయారసమ్మునన్
జూడగ వచ్చినాఁడవా మనోహరరూప!
జగన్నియంత! నా
గూడలు వంగిపోయె,
తలక్రుళ్లిడి నా పొగరెల్లజారె; నో
రాడుటలేదు బ్రమాన్పడె నజాండము
తావకదర్శనమ్ముతో॥ 30

ఆ రామ లక్ష్మణులు త
ద్వీరాగ్రణియైన మారుతి ప్రస్తుతినిన్
పేరిమి వినవేసిరి వి
స్తారాశ్చర్య చకితులయి సంభ్రమమనుతులై॥ 31

తమ వృత్తాంతము విన్నవించుట కయోధ్యా
స్వామి యాజ్ఞాప్రభు
త్వముచే లక్ష్మణుఁ డెంతయో ముదముగాఁ
ద ద్వానరస్వామినిన్
సుముఖత్వంబున జూచి యిట్లనియె నో
సుశ్లోకమూర్తి! త్వదీ
య మహాత్మ్యమ్ములు మాకగోచరములై
యాశ్చర్యముం గొల్పెడిన్॥ 32

వానరపుంగవా! కనులు పండు
వానర్చి త్వదీయ దర్శన
జ్ఞానము; రామనామ జపసౌఖ్యము
లో గహానమ్ము దివ్య నం
తాన వనమ్ముఁ జేసితివి; తావక
నామముఁ జెప్పి ముందుగా
వీనులవిందు సేయుము వివేక
ధనర్బల కార్యసాధనా॥ 83

ఓ కపిరాజసత్తమ! మహోన్నతమైన
త్వదీయ దివ్య సు
శ్లోకము మే మెరుంగము త్రిలోక
పవిత్ర చరిత్ర మూర్తివై
యీ కమనీయగాత్రుఁడు మహీసుతతో
పితృవాక్య మేలగా
భీకర కాననంబులకు వేడుకతోఁ
జనుదెంచె వింటివా! 84

ఈ పితృవాక్యపాలకుని కే
నను జుండ తదీయ ధర్మ వి
ద్యా పరమేశ్వరాజ్ఞ తలఁదాల్తు సదా
కలలోనగూడ యే
పాపమునైన సైపని కృపారనమూర్తి
కవీంద్ర! తన్మహా
త్మ్యపతి ధర్మపత్నిని నిశాచరు
లెత్తుకుపోయినారయా॥ 35

కోసలదేశనాయకుని కూరిమి
బిడ్డఁడు వీరలోక వి
శ్వాస మహాన్వయంవరసభా
శివబాణ విలుంతనక్రియా
భాసుఁడు సూర్యవంశ గుణభాగ్య
విలాసుఁడు రామనామ స
చ్ఛాసన సార్వభౌముఁడు నిశాచర
మాయకు తెల్లఁబోయెగా॥ 36

కోదండరాముఁ డీతఁడు
వేదండ బలాఢ్యులైన వీరులనెల్లన్
కోదండముఁదీసి భళే
ఫూదండలు సేఁగలంచు పుట్టలనెల్లన్॥ 87

అంత ధనుర్బల ప్రముఖుఁడై
గహనాంతరసీమఁ జొచ్చి ది
గ్దంతుల గుండె దద్దరిలు కష్టములోర్చి
యమాయకుండుగా
వింతను పర్ణశాల పరివేష్టితుఁడై
నిజధర్మ పత్నితో
వంతనమొంది కాలమును జక్కఁగఁ
బుచ్చెను నేను గొల్వగా॥ 88

శ్రాత్మజనయిత్రినోములు పసందుగ
ముందుగ, పండఁజేసి, య
వ్యాజ కృపాప్రపంచ జనకాత్మజ
చల్లని జ్ఞానమాతయై
రాజకళా ప్రసన్న రఘురాము
పదాబ్జయుగమ్ము రేఁబవల్
పూజలొనర్చుతల్లిని ఖలుల్
దనుజాధములు లేమిచేసిరో॥ 89

ఎవఁడో బంగరులేడియై మెఱసి
మమ్మెంతో విచిత్రంబుగా
వనమూనించఁ దలంచి జానకిని
గర్వాంధుండు గొంపోయెః దా
నవులం దింత దరిద్రు లుందురని
యేనాఁ డేము భావించలే
దు వివేకాగ్రణి! తచ్ఛరద్విషుల
గూల్తుం రామబాణమ్ములతో॥ 40

వాయువు ముజ్జగముల దీ
ర్ఘాయువుగా జేసి దిగ్జయ జటాయువు దై
త్యాయువుఁ దీయంజాలన్
నాయన! నాతల్లిజాడ నయముఃగఁ జెప్పన్ 41

లంకాపట్టణ సార్వభౌముఁడట,
నిర్లక్ష్యస్వభావైక ఘు
ర్ఘాంకార ప్రళయాట్టహాస ఘన
మూర్ధన్యుండటా; దిక్పతుల్
వంకా లాగెడి బంటు లైరట;
ప్రతాపశ్రీదశగ్రీవుఁడై
జంకించెంగదటోయి లోకము
ధనుష్టంకార శౌర్యమ్ముచే॥ 42

భూసుత నా జపుండు కొనిపోయె
నటంచు జటాయు వేమిటో
వాసన యించుకంత పసిబట్టి
వచించెను, వానరేంద్ర! వి
శ్వాసధనుండ వీవు సహవాస
మొనర్తుము; రావణుండు సిం
హాసనభ్రష్టుఁడయ్యెడిముహూ
సుముహూర్తము వెట్టు శీఘ్రమే॥ 43

సౌమిత్రి మిత్ర నీతిని
రామాంఘ్రి సువర్ణదివ్యరాజీవముతో
ప్రేమాన్వయముగఁ గైకొని
భీమాకృతిచే ప్లవంగవీరుఁడు పలికెన్॥ 44

దాశరథీ నమోస్తు! భవ తారకనామ
నమోస్తు! ధర్మ సం
దేశ మనోజ్ఞమూర్తి! నవనీత
కృపారసచక్రవర్తి! యే
దేశమునందు మా జనని తెలియఁగూడ
యమాంత మింక త
ద్దేశము మొత్తమెత్తి భవదీయ
పదమ్ములముందుఁ బెట్టమే॥ 45

శతసహస్రకోటియుగాల జన్మలెల్ల
ధారఁబోసి త్వద్దర్శనార్థమై నింక
కలరు వానరప్రభులు నాకంటె బలులు
వారిముం దేను నలుసును పరమపురుష॥ 46

హనుమంతుండని యాంజనేయుఁడని
నా కా రెండు పేర్లుండె; నం
దన మూర్ధన్యునిగా నొనర్చిన
జగత్ప్రాణుండు నా తండ్రి, న
చ్చిన సుగ్రీవుఁడు నాకు ఱేఁడు నను
వాసింగన్న శ్రీ యాంజనీ
మణి పాదమ్ములసాక్షి దైవ మిల
రామస్వామి నన్నేలుఁడే॥ 47

గీతాంజలితో నృత్య సం
గీతామృత రసతరంగిణి కెరటములతో
వాతాత్మజుఁడు కొలువ సం
ప్రీతాత్ముండై యయోధ్యఱేఁడిటులనియెన్. 48

హనుమా! తావక దివ్యదర్శన...
బ్రహ్మానం... ంగొల్చె, ని
ర్జన ఘోరాటవిలోన ...ంత కష్టాన్వి...
స్నేహాభాగ్య... జీ
వనమం గాంచము మే...; నీవగిది
మావద్బాంధవుం ... లేం
డని బ్రహ్మాండములెల్ల తన్విచ్ఛ...
ధ్యానించుచున్నా... ... లే॥ 49

హనుమన్నా! వినుమన్న! మేలువులు
నూరైనం సఖే యొక్క మి
త్రునితోం దూగవు, మిత్రులిక పదినూర్లుం
నిండినంగూడ గొను
క్క నిఖార్సైన దయాబ్ధి... డుం దులం
దూగంలేవు; లోకైకపా
వని! తత్త్వేసుపయోధి తూగ దిల
నాపద్బంధుతో నమ్ముమీ॥ 50

చుట్టాలు బంగారుకొట్టాలులోగాని
చుట్టరికము తిన్నగాబెట్టరయ్యా
ఇల్లాండ్రు మైనిండ హేమంబిడిరిగాని
అనురాగ మొగ్గుగాబోయరుకదయ్యా
అన్నదమ్ములు కల్మి యనుగనుండినగాని
తోడయి మర్యాద చూడరయ్యా
బిడ్డ లాడికి యాట దొడ్డదనినగాని
వేడు, నన్నమును బిల్చి పెట్టరయ్యా
కన్నవారు సంతతిసుఖమున్నగాని
కనులపండువై కాలమ్ము గడుపరయ్యా
మిత్రునికి మిత్రుడైన ప్రేమిరతురయ్యా
ఆంజనేయ ఆపద్బాంధవాభిధేయ॥ 51

సకలైశ్వర్యకళా విరాజితములై
సౌందర్యసౌఖ్య ప్రథా
వకథాసౌధబుధావళింజనములై
నానాపురశ్రీలు ఖ
ర్చుకు వర్ధిల్లెనుగాని మచ్చు కొక
పూజ్యం డింక నీమాద్కి కం
ద్లకుగ గన్పించకపోయె మారుతీ!
కృపాలావణ్యవారాన్నిధీ॥ 52

వనవాసంబులు మీకు, సుందరకళా
ప్రాకారశృంగార ది
వ్యనివాసంబులు మాకు, వానరవిభూ!
త్వద్భాగ్యయోగ్యమ్ములై
న నివాసమ్ములు కూల్చు మానవులపైనం
గౌరవంబేల? స
జ్జనసాంగత్యము మారుతాత్మజ!
భవత్సాన్నిధ్యమం దున్నదే॥ 53

బృందావనోద్యానమందానిలాస్థాన
సౌఖ్యంబుకంటె నీ జాలి మేలు
అమృతమందాకినీభ్రమరగీతాలాప!
భాగ్యంబుకంటె నీ పలుకు మెఱుగు
త్రిభువనసౌందర్యదివ్యతేజస్వినీ
నాట్యంబుకంటె నీ నడత లెస్స
బ్రహ్మాండకీర్తిదీవ్యచ్ఛౌర్యకార్య
శుభ్రజ్యోత్స్నకంటె నీ భక్తి గొప్ప

శతసహస్రకోటి స్వర్గచక్రవర్తి
వజ్రవైడూర్యరత్న సంపదలకంటె
నీ మహాదర్శనమ్ము పుణ్యములసొమ్ము
అఘవినాశాయ! శ్రీప్రసన్నాంజనేయ॥ 54

ఆనందాశ్రువు లిట్లు చల్లని ఘన
శ్యాముండు రాముండు నె
మ్మనమున పొంగెడి వాయునందనునిపై
మిన్నంటి వర్షింపఁగా
ఏనాఁడో పడియున్న మోళ్లుసహితం
బెన్నో యిగుళ్లెత్తి స
న్మానించెం రఘురామమూర్తిని కళా
మాణిక్యపుష్పాలతో॥ 55

రాముండు నీలమేను
శ్యాముండు కృపాకటాక్షసౌందర్యకళా
ధాముండు కౌగిట మహా
ప్రేమాన్వితుఁడై గొన కపివీరుం డనియెన్॥ 56

మఱచితి రామచంద్ర యిఁక మైథిలిమాట,
క్షమించుడయ్యా! ద
గ్గఱ కరుదెంచినారు, గుణగణ్యుఁడు
నా యెకిమీఁడు కోటి వా
నరభటు లున్నవాఁడు భువనంబున
మీ చెలికాఁడు కాఁగలం
డరయుఁడు స్వామియంచు హనుమన్నటు
గై కొనిపోయె భక్తితో॥ 57

ఈవిధ మాంజనేయుఁడు విధేయుఁడుగా
            రఘురామనాము గీ
తావిధవోజ్జ్వలుండగుచు దాశరథిం
            భజియించి భక్తితోఁ
ద్రోవను రామలక్ష్మణులతో
            నరుదెంచుట లేచి చూచి సు
గ్రీవుఁడు భీతితోడ వణకెం తరువుల్
            కురిపించె పుష్పముల్॥ 58

హనుమంతుం డభయమ్మునం బరవశుండై,
            బల్ ధనుర్ధారులై
వెనువెంటం బఱతెంచుచుండెడి మహా
            వీరావతారమ్ములన్
గనుచుం గంతులువేయుచుం మధుర
            విన్యాసమ్ముతో వచ్చు ది
క్కును సుగ్రీవుఁడు సూచి త్రుళ్లిపడి
            దూకుల్ పెట్టె భీతాత్ముడై॥ 59

ఆ సుగ్రీవుఁడు కంపితాంగుఁడయి
శాఖాగ్రంబునం జిక్కి వి
న్యాసమ్ములఁ బలుమార్లుఁ జేసి భగవ
ద్ధ్యానమ్ము ధన్యాసికిం
జేసె నంత కపికోటి యచ్చెరువునం
జేరంగ భల్లూక రా
జాసీనుఁడయి మెల్లఁగాఁ బలికె
ధైర్యస్థైర్యగాంభీర్యముల్॥ 60

కపిరాజా! భయమేల? నీ బలము
ని గ్గన్పెట్టు కొన్నట్టి నీ
కపిసైన్యమ్ము త్వదీయప్రాణహితులై
గర్వించుచున్నట్టి మా
విపులాఖండలశౌర్యమండలము
భావింపంగ సామాన్యమా
యిప్పుడే తద్బలశాలి వాలివని
నీ వీక్షింతు వాలింపుమా॥ 61

అని యోదార్చెడి జాంబవంతుని
యసాధ్యంబైన వాక్చాతుర్యగ
ర్జన సుగ్రీవుని చెంతకోతి విక
హాస్యంబై మాఱొత్తి యి
ట్లనె; మున్నా బలశాలి వాలి మన
సైన్యాలన్ని చెండాడి త
ర్మినవాఁ డింతటి వీరనా క్కెచట
దూరెం స్వామి వాఁకుచ్చుబిగా॥ 62

ఆమాట కొక్కరపెట్టిన
నామాలకపుల్ పకపక నవ్వంగ కపి
స్వామి చిఱునవ్వు నవ్వెను
భూమీశునివెట ముఖ్య విదూషకుఁడై॥ 63

రామునితో ధనుర్బల పరాక్రమ
కేసరియైన లక్ష్మణ
స్వామినియుంచి బంటువలె వాయు
సుతుం డటు ముందుసాగి సు
గ్రాముని తుల్యుఁడైన కపిరాజు
సమీపముఁ జేరినామటం
చా మహితాత్ములం సుమలతానములం
బొనరించి యిట్లనెన్॥ 64

వీరాగ్రేసరులార ! కైకొనుఁడయా

విశ్రాంతి యిచ్చోట వి

స్ఫారప్రేమసముద్రుఁడైన స్లనగస్వామిం

భవత్పాద పూ

జారాజీవకళాన్వితైకకవితా

సామ్రాట్టునింజేసి స్వా

మీ ! రామప్రభు ! నీకు దర్శనము

సేయింతుం గటాక్షించుడీ॥ 65

అని రఘురామచంద్రుని దయారస

భాగ్యముతో సమీరనం

దనుఁడు మహాప్రమోదకవితా

మహితార్ణవతృప్తవీచికా

ఘనుఁడయి లేచి దండమిడి గ్రక్కున

నేగను నొక్కగంతుతో

వనచరుఁడైన వానరుని భక్తికి

లోకము లజ్జఁబొందగా॥ 66

భయవిభ్రాంతి యెడందరాపిడి సుహా
బాధించి వేధించి నే
ప్రియవాక్యంబులు వీనులంబడక
సుగ్రీవుంగు కూర్చుండి ని
శ్చయ మాలోచనచేయుచున్నతఱి
నుత్సాహంబుతో వచ్చి సం
శయవిచ్ఛేదమొనర్చు మారుతి కపుల్
సంతోషముఁ జెందగా॥ 67

ఆవరుసం గపుల్ తరువులచ్చెరువుల్
ప్రమదైకనాట్యముల్
తీవిగఁజేసి కొమ్మలు పెకల్చు
వంచుచు పెద్ద పందముల్
కేవలముం సుఘాతువలె లేపఁగ
మారుతివంకఁజూచి సు
గ్రీవుఁడు నల్కొని వెఘడు దివ్వాన
వచ్చితివంచు వేడ్కతో ॥ 68

వచ్చినవార లెవ్వారు? ప్రభంజనపుత్ర !
తదీయు లెవ్వరో
మచ్చికతోడ గంటివా? నమస్తము
వింటివ ? తన్మహాత్మ్యలే
కచ్చెరగాఁ గాలుద్రవ్వి కపికాండము
మీదకు వచ్చుచుండిరో
అచ్చునుగ్రుద్దినట్లు స్ఫుటమై
పొడఁగట్టెను వారి తేజముల్॥ 69

మన ప్రాంతంబున కింత వీరధరణీ
మార్తాండు లెన్నండు వ
చ్చినటుల్ లేదు; తదీయశౌర్యవదనశ్రీ
బాహువైశాల్యమం
డనవత్ప్రభ వెల్గు వీరులను
గాంచంలేము, వారెవ్వరో
హనుమా ! చెప్పుము చిక్కబట్టుము
మదీయప్రాణముల్ ధైర్యముల్॥ 70

వారు పరాక్రమంబున చివాలున
నీ వెనువెంట్ల బల్ ధను
ర్ధారుల్ నొంచు వచ్చెడివిధంబున
గాంచుచు మేము చెట్లపై
జేరి మహెంతయో బెదరి చేతులు
మోడ్చి స్మరించినాము దై
త్యారిని మారుతీ యనుచు నల్ల నొకా
నొక కోతి దూకెడిన్॥ 71

భయ మేమాత్రము లేదటంచు హనుమస్వామి
ప్రమోదాత్ముడై
జయసంరంభముతోడ నిట్లనె
కపిస్వామీ! వినుండింక ది
గ్జయసామ్రాట్టులు వారు కోసలపురా
సంస్థాన ధౌరేయులై
నయమున్ విస్మయచిత్తులై విధి
విధానం గాన కేతెంచిరి॥ 72

పేరులు రామలక్ష్మణులు విశ్వములో
మన కోతిమూకకు
వారిజనేత్రులం గనెడి భాగ్యము
దెన్నఁడు పట్టలేదు, త
ద్వీగులు బొద్దుమీనమును పెంచి
సాదించిన మేకపోతుగం
భీరులు కారు, లెమ్ము కపివీర!
కనుంగొన రమ్ము వేడ్కఁతో॥ 73

ఆ జగదేకవీరులు దయాప
వార్ధులు నవ్య దివ్యతే
జోజయవైభవోన్నత యశోధన
మూర్తులు వానరప్రభూ!
రోజులు చక్కఁబడ్డవి, సిరుల్
మొలకెత్తెను, లేక తన్మహా
పూజితు లింత కోతిమొగముం
గనుగొందురటయ్య ప్రీతితో॥ 74

సందేహించకుఁడయ్య నానరవిభూ !
సద్ధర్మ సౌజన్య స
త్సౌందర్యాత్ములు వారివయ్య! విధ
ర్మాజ్ఞక్రియా క్రౌర్యమో
కందర్పోజ్జ్వల జాడ్య మౌఢ్య దనుజ
స్పర్ధోద్యమంబో, మతే
సందర్భంబొ, ధరాతనూజనకటా
త్మాజాని కోల్పోయెఁగా॥ 75

పితృసామ్రాజ్యంబుల నేలఁగానడవికిం
బెన్వేడ్కలో వచ్చి దు
ర్మతులం గొండొకకంటఁ గన్గొనక
యీ రాజేంద్రులత్యంత ప్రే
మ తుఁ బాట్లులుగాఁ జెలంగి
కపిసామ్రాజ్యాధిపా ! నేఁడు భూ
మత కోసమ్ము విషాద వైతరణిలో
శుష్కించుచున్నారయా॥ 76

సరిసరి గాధ మొత్తము వసంగుగ
నున్నది చెట్టుచేమలన్
చెరిగి సదా యొకేరకపు పిట్టలు
నొక్కట చేరినట్లు భూ
వరులు మహా కవీశ్వరులు బాగుగఁ
జేరి రటంచు సంక యీ
యిరువురి స్నేహ మేర్పరచుటే
శుభమానని కెల్ల వానరుల్॥ 77

కేవల మా మహాత్ములు సభాజన
సౌఖ్యముఁగూర్చి మానవుల్
కైవడియున్న వారలని గాంచఁగ
రా దవతారమూర్తులై
భూవలయాన ధర్మబలమ్ముం
నిల పెట్టెడివారటంచు సు
గ్రీవుని మారుతాత్మజుఁడు ప్రీతిగ
తోడ్కొనిపోయె మెల్లగా॥ 78

దరహాసంబున దమ్ముని౦ గని యయోధ్యా
స్వామి సౌమిత్రి! యీ
పరమానంద మెఱుంగ మెన్నఁ డనె;
దేవత్వంబు సాధించు భూ
నరు లివ్వానరు లైః మర్త్యమును
సంపాదింతురా? చూడు మ
చ్చెరువుఁ గొల్పిరి తోరణమ్ములయి
వాసిం వన్నెలుయ్యాలలై 81

కొండొక కోతి కొట్టుకొని గుండెలు
వానరులార! వ్యాఘ్రము వే
దండము లెన్ని యీ యడవిఁ ద్రచ్చినఁగూడ
రవంత భీతి లే
కుండ యధేచ్ఛగాఁ దిరిగి యుంటిమి గాని,
మనమెన్నఁ డింత కో
దండధనుర్ధరుల్ మనలఁ దాకినటుల్
కనమంచు దూకెరా॥ 82

ఆవిధ మొక్క కోతి భయ
మావహమై దుముకంగ దానితో
లేవిడియైన కోతులు చ
లించి మనుష్యులు నాల్గుదిక్కులన్
ద్రోవలువట్టినట్టి గతి
తో ప్రతిగ్రామము పట్టి నేడు సు
గ్రీవుని వారసత్వ మన
కే పడెనేమొకో కొంప కొంపపై॥ 83

కోతులు లేపిన గోలకు
కోతులయెకిమీదు గూడ గుండియదడలో
జాతర కేగెడి పశువై
భీతిల్లగ వాయుసుతుండు వెతం బాపి నిటుల్॥ 84

కేని! కోతులార! చెవి
దిబ్బలుగట్టెడి గోల తద్దరా
జాని దయాపయోధి, తెలి
చాటు నటించు విరోధి కాదు; లో
కానికి శాంతిదాతయయి
కాఱడవుల్ నవనందనాలుగా
తేనెలువోసి చేయు నరు
డెంచిన దేవుడుసుమ్మి కొల్వుడీ। 85

ఆ దివ్యసుస్నిగ్ధ పాదపద్మ యుగాలు
కాంతురే యే వజ్రకాంతినైన
ఆ జగత్కీర్తి సుహార్ణవ హృదయాలు
వీక్షింతురే యెంత విలువనైన
ఆ వీరశౌర్య విశాలభాను బాహుబలాలు
తిలకింతురే యెన్ని తిలలనైన
ఆ భువనైకమోహన రాజతేజాలు
పరికింతురే వేల్పు దొరలనైన

ఆ మధురమధురాంచితకథామృత రస,భాగ్య విన్యాసముల చుతేభాననైన
జూతురే కుప్పిగంతుల కోతులారా, విశ్వకళ్యాణమూర్తుల వీరపతులు॥ 86

ఈ గండ్రశిలలేడ్చి యేడ్చి రామకథా ర
స తరంగిణీక్షీరజలధులైన
ఈ మోడు మోకేడ్చి కోమలంబుగ రామ
నామపల్లవ పుష్పధామమైన
ఈ పక్షిసంతాన మేడ్చి రామామృత
గాన సోపాన సంస్థానమైన
ఈ కీకరాటవి క్షోభించి రామ రా
జ్య మహోత్సవపు పందిరైనగూడ

శతసహస్రవిధాల మీ సరస నేడు, గడన కేమాత్రము దగని జడుడ నేను
రామనామము తీపి మఱిగినగూడ, కుప్పిగంతు లేటికి మీకు కోతులారా॥ 87

సేవకుఁడంచు భక్తి కరి
పెంచుఁడటంచు మహావిధేయుడై
శిరములు వంచి సంస్తుతులు
సేయుఁ డటంచు వచించి వెంట వా
నరపతి నిఁక గైకొని విస్ర్ముశగా
హనుమంతుఁ డెన్నియో
విరచిత పుష్పహారములు వేసెను
కోసలరాజ కోటికిన్॥ 88

కాలాతీతము చేసితిం రఘువరా!
కారుణ్య ధారాధరా!
నా లోపాలు క్షమించుడయ్యా!
కపిసంఘాలన్నియుం గూడగా
నాలస్యంబయిపోయె దాశరథి!
యీ యుధ్వాన్నలోకాన నే
లీలం గోతుల కెక్కువేమి త్వరగా
క్షేమావిర్వైసం నుదుల్॥ 89

ఇదిగో! స్వామి! పరిగ్రహించుమిదె
ఫలాళి వ్యాంగిలోఁ దీపిస్తై
నవి పన్నిటిసాలు; కాఁడఁలోనం
దక్కు వెచ్చోట ని
య్యాశీ; నీ దర్శనభాగ్యహేతువున
ఘోరారణ్యవృక్షాలు మేల్
పువులం భక్తిరసాలసాలములు
కాంబోలయ్యె రామప్రభూ॥ 90

నిలుకడలేని కోతులకు నీవు
మహాత్ముఁడవంచు బొత్తిగా
తెలియదు రామచంద్ర! భవదీయ
కృపారసవృష్టిచేత ని
ర్మలముగ నిశ్చలమ్ముగ సమత్వముగా
కపిజాతిఁ మార్చి కో
తులమును జేసికావుము సమస్త
జగమ్ములు పల్లవించగా॥ 91

హానుమన్నా ! పండ్లను మీా
రును తినఁ డన్నా యటంచు ప్రోత్సాహముగా
నినవంశరాజచంద్రుం
డనగా వీరాంజనేయుఁ డణఁకువ ననియెన్॥ 92

ఇదిగో ! రామవిభూ ! మదీయులకు
నేఁడీ పండ్లకంటే, త్వదీ
య దయార్ద్రాక్షరసానుభూతి మధురంబై
యున్న నీ కండ్ల సం
పద మా కెక్కువప్రీతి, యా చలువతో
బ్రహ్మాండముల్ పల్లవిం
చి దరిద్రంబు లుపద్రవంబులు సహా
నిర్మూలమౌ శీఘ్రమే॥ 93

దేవ ! మహానుభావ ! భవదీయ
పదాబ్జములు లీ యరణ్యపుం
ద్రోవల నెంత నొచ్చినవో; దుస్తరమై
పద మానసీని ఘో
రావని ముండ్లు గ్రుచ్చుకొని యబ్బ !
మఱెంత దురంత బాధలన్
నీవు సహించినావో దొర ! నీ పద
పద్మములు లేవి చూడనీ॥ 94

అడుగుల్ బొబ్బలు పొక్కనేమొ
పయనంబై నావు నా గోల కి
వ్వను; నీ కేమి యొసగి తృప్తిపఱతుం?
ముందిక యీ మొద్దుబా
రెడు చర్మాం బొలిపించి జోడు కడు
ధర్మం నీవు పట్టించుకో
పడియుందుం సతతంబు నీ చరణ
సేవాదీక్షతో సాయికా॥ 95

ఈ బంగారు పదాబ్జముల్ కొలుచు
మున్నెన్నో మహాజన్మలెం
దో బోల్తాల గొట్టిపోయినవి;
యెంతో పూర్వపుణ్యైక కల
శ్రీస్త్ర గాంధర్వ క్షేమమండి మునుకుం
శ్రీరామ పాదాబ్జముల్
బాబూ! ఎక్కడ కోతుల ఏ! తలందాల్పం
రాము ధన్యాత్ములై॥ 96

హనుమ తుం డిటు లెంతయో పరగ
భక్త్యాగ్రేసరుం డౌచుఁ బ్రా
ర్థనగావించి, మహోపచారగు
లహారంబైన సంతోషవా
ర్ధి నిమగ్నుండయి యాచరించి
కరుణార్ద్రీభూతచేతస్కుఁడై
చిను కుల్ రాల్చి కపిప్రభుం దెలిపి
కొల్చెం గోసలాధ్యక్షులన్॥ 99

వాయుసుతుఁడు పాదములపైఁబడి
సంతసాన కోతులెల్ల ఘూ
ర్ణోయిలితో ప్రణామములతో
ప్రణమిల్లి విధేయులై నుతుల్
సేయుగ రామలక్ష్మణులు చేరఁగఁ
దీసి సమస్త దివ్య దీ
ర్ఘాయువు లిచ్చి యభయంబిడి
రందఱికిక ప్రీతితో॥ 100

అపు డెపుడో ప్రభూ! దొరికినట్టి
సువర్ణ విభూషణంబు లీ
నృపులకుఁ జూపుఁ డయ్యవి మహీసుతవో
మణి యే రిన్నైనవో
విపులము సేతురం చోర కపిప్రము
ఖుం డనగానె వీర శౌ
ర్య పవనపుత్రుఁ డౌనని రయంబున
దెచ్చెను నొక్క గంతులో॥ 101

రామా! యీ తొడవుల్ కనుంగొనదు
మా రాజ్యంబులో నింత ల
క్ష్మీ మాణిక్యసువర్ణ భూషణము
లీక్షింపంగ లే దేమి; స్వా
మీ! మా తల్లివి రోమము చూడుఁ డని
తన్మేధావి యందిచ్చె; శ్రీ
రాముం డయ్యవి చూచి పొంగిన
సముద్రా లెన్నియో క్రుంగెరా॥ 102

ఈ వసుధాతలంబునకు నింత
ప్లవంగ బిడౌజుఁడైన సు
గ్రీవ సునామధేయుడు సుఖించెడి
రాజ్యము వాలి లాగి బల్
చేవనుబట్టి గ్రోసెను బలీయముగా
నగచాట్ల కానలో
కావు మటన్న మారుతి నుతిం విని
రాముడు జాలిగుండెతో॥ 107

హనుమా! నీవు నిజమ్ముగా శివుఁడవయ్యా!
యిందు సందేహ మే
యణుమాత్రంబును లేదు నమ్మితిమి;
నీ యాజ్ఞాప్రభుత్వమ్మ మే
మనయంబుం దలఁదాల్చుచుందుముఁ
త్వదీయ ప్రేమ సామ్రాజ్య శౌ
ర్యనిధుల్ సోతులు కాంచకుండినవి
ఘోరారణ్య దేశాలలో॥ 108

ఆగమమూర్తివై ఘనదయారస
జీవన చక్రవర్తివై
మా గోడవల్ గ్రహించి తగుమార్గముఁ
జూపితి కానలందు, నీ
వే గతి మారుతీ! బ్రతుకు లెన్ని
సముద్రము లీదుచున్న మా
ర్రోన్మగు నెడందలోకవనముల్
నినుగొల్చెడి భక్తిగీతముల్॥ 109

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీరాముం డభయ ప్రదానముఁ
నిచ్చెఁగాని, సుగ్రీవుడే
మో కేయుంబవలేమి తోచక తలంపుల్
గుంపుతో గుండె బే
జారై యెచ్చట యొండుటా కదిరినం
సంక్షోభితుండై మహా
భీరుత్వంబున ఋష్యమూకమును
గంపించెన్ బ్రచండమ్ముగా॥ 1

కంజదళాప్తు డే దసకుఁ గళ్ళెములాగి
యదల్చు చుండెనో
పింజలు పింజలై మొయిలు పిండులు
మింటి యెడారి యొంటెలై
గుంజుకొనంగ జొచ్చినవి క్రొంజిగురాకు
పసిండి చీరతో
సంజలతాంగి సోయగ మొసంగగ
గాఁటుక కంటి కోయిలై॥ 2

ఈ కోదండ ధనుర్ధరుం డసలు స్వామీ !
కోసలాధ్యక్షుఁ డౌ
నో కాదో యని కోతులన్నియును గన్నుల్
మూయుచే తేదటం
చేకాంతమ్మున వానరుం డొకడు
నోరెత్తంగ సుగ్రీవు డే
మో కంగారయి గంతుచిందులను
కూర్మిల్ వోయి ఘోషించెరా॥ ౩

ఏమియు తోచకున్నది మఱేమి
యుపద్రవమింక జూతుమో
యీ మునివేషధార్లు మన కెక్కడ
దాపురమైరి ? వీరు సం
గ్రామ పటుత్వ మిక్కడి జగమ్ము పయిం
బరపించ వచ్చినా
రేమొ, సమీరనందనుని కియ్యది
కన్పడ కెఱ్ఱువంచెనా ? 4

అతఁడా దేవుఁడు ? దేవుఁడైన మన
సాయంబాతఁ స్పర్థించునా ?
బ్రతుకుల్ త్రోవలు తప్పి కాఱడవి త్రోవల్
పట్టె యేతెంచునా ?
అతి మర్యాదను కోతిమూక లిది
రవ్వంతైన కన్పెట్టలే
క తయారయ్యెను పంగనామములు
తత్కాలాంతకుం డద్దగా॥ 5

నిక్కము నిక్కంబంచును
అక్కపినాథుం డమాంత మదిరేడి యెదతో
దిక్కులు నాలుగుఁ జూచుచు
ముక్కున వ్రేలిడుకొని కనము వినము ధరపై॥ 6

కోతుల జతపట్టిన వా
డా తుట్టతుదకు మహాత్ముఁడౌరా ? సదరా
ఆతని తోకా నన్నీ
వైతరణిని దాటవేయు బడునది ? భళిరా ! 7

చక్కగ చేరినారిటకు శ్రావణభాద్ర
పదాలువోలె, నే
నెక్కడనుంచి తెచ్చి మరి యీ జడదార్లను
మేపుచుందు ? నా
చిక్కులు తీర్తురో తుద కిసీ యురికుచ్చులు
పోసి పోదురో
బిక్క మొగమ్ము పెట్టుకొని వీరి
పదాబ్జయుగమ్ము పట్టుటా ? 8

మూతికి మీసముల్ మొలిచి ముజ్జగముల్
నిలవేసి గెల్చి వి
ఖ్యాతిగ జైత్రయాత్ర మొనగాడయి
చేసినవాఁడు క్షత్రియుం
డై తలయెత్తవచ్చు, మరి యక్షయపాత్రను
బట్టి యెప్పుడ
న్నాతురుడైనవాఁడు తగునా ? తలయెత్తగ
వేదు మూతితో॥ 9

అని సుగ్రీవుడు చంచల
మనమున ననుమానబాధ మాననివాఁడై
పెనవేసెడి వ్యథనుండగ
తన దగ్గరకోతి యిట్లు తెల్లడఁ బెట్టెన్॥ 10

ఏదో యోచనలో నిమగ్నుడయి
మిన్నీక్షించు చెల్లప్పుడా
నై దేహీపతి యొక్కడో పిలుచు
తద్వాచా ప్రమేయాన మా
పై దూకుం వెనకున్న వీరుడెవడో
భావించగా వీరి చూ
పే దిక్కుం కదలించు చున్నదియొ స్వామీ !
ముందు వీక్షించుమీ॥ 11

భగవద్ధ్యానము చేయుచున్న చలతత్వంబై
బకధ్యాన మె
ల్ల గిరుల్ మ్రింగెడిదాఁక వచ్చినటులీ
లక్ష్మీపతుల్ నేఁడు మె
ల్లగ వానుల్ వలె జేరి నీబలము నెల్లం
మ్రింగి నిన్నింక నే
కగ తద్వాలికి పట్టి యిచ్చుటకు
చిక్కా లొడ్డిరేమో ప్రభూ॥ 12

అసలే కోతులనుండి వచ్చిన మనుష్య
శ్రేణిలో ద్వేష రో
ష సమస్యల్ శతకోటి సంఖ్యలయి
విశ్వంబందు విశ్వాస శూ
న్య సమాజంబులుగా చెలంగిన నరుల్
నాజూకుతో వానరుల్
దేశ కన్గొందురటయ్యా? కన్గొనిన
తల్లీలల్ మహాచేటుకో॥ 13

తన సామర్థ్యము తాను కన్గొనని
మేధావంతు డెల్లప్డు ప్ర
క్కను నీచాధములైనవారి కరుణాం
కాల్సేతులం బట్టుచుం
డును, తన్నైచ్యము జేసి మూపుపయి
మూఢుల్, మెల్లగానెక్కి, స్వా
రిని గావింతురు వానరప్రభు
జగచ్ఛ్రేయంబు ఛేదింపగా॥ 14

జీనము లేచివచ్చెడి వశీకర నైక
వచో విలాస ల
క్ష్మీ వనభాగ్య వైభవముచే
ధరపై కొనియాడబడ్డ సు
గ్రీవుడ వీవు వానర వరేణ్యా!
మఱెందుల కింత దైన్యపుం
జీవన మెత్తుచుండెద విసీ!
మనుజుల్ దనుజుల్ కృతజ్ఞులా॥ 15

మునివేషంబులు సూచి మోసపడితేమో!
వీరు మహానీంద్రులే
కనకైనన్ విలుదాల్చుటేమి కతమో
కన్గొంటివా వీర శౌ
ర్య నిధుల్ వీరని యెంచితేని మఱి
సన్యాసాశ్రమం బేల నై
గొనుటయ్యా? నరులెంత టక్కరులో
కన్గొంటంత సామాన్యమా! 16

కొండలు కొండలే గుండెలు బ్రద్దలై
　　　కాళ్లెట్టు కదపలేక పడియుండె
కడఁలి రాయఁడు కూడ హడలిపోయి సతమ్ము
　　　గడగడ వణకుచు గడబిడ పడె
భీకరాటవి మోము వెల వెల బారి
　　　సహారా యెడారిగా మారిపోయె
జీవనదులు బక్క చిక్కిన బ్రతుకుతో
　　　డొక్కలెండి దినాలు లెక్క పెట్టె

మానవుఁడు దానవుఁడయి భూమండలంబు
పెండలము జేసి వేగించు చుండెననుచు
ఈ యఖండ బ్రహ్మాండ దీర్ఘాయువెల్ల
గుప్పిటను బెట్టుకొని బ్రహ్మ కునుకు మఱచె॥ 17

మానవుడన్న దానవుడు మర్కటనాథ !
　　　మహేమొ నీవు త
న్మానవులైనవారి చరణాలను బట్టి
　　　తరింప జూచుటే
హానికరమ్ము సుమ్మి; హనుమన్న కయోమయ
　　　భక్తి యెక్కువై
కానదు మంచి చెడ్డలు జగత్స్థితి
　　　యెంచదు విశ్వసించుమీ॥ 18

మానవుఁ డెన్ని మాయలకు మస్తకమై
మకుటంబుఁ దాల్చెనో
కానవు నోరులేని పశుకాండము లేమి
కపీంద్ర ! తత్ప్రజా
దీనముకాని కోశములు దేశములుండవు
గూడ; యే పర
ధ్యానము లేక చూడుము విధాత్రు విధానము
తారు మారులా॥ 19

అకస మావులించినది, యచ్చెరువైన
సహస్ర తారకా
లోకము మోసి మోసి; కడుబుబ్భుల బుబ్భులు
దిబ్బ దిబ్బలై
లోక మెడారు పెట్టినది; లోకులు
కాకుల గోలతో తయా
రై కదలించు చుండిరి లయంబుల
కగ్గి తుఫాను లెన్నియో॥ 20

ఈ నిబిడాంధకారతతు లెవ్వరి
చూరులనుండి మెల్లగా
కూనలు కూనలై దెసలకుం దిగఁచుండెనవో
క్రమమ్ముగా
భూ నభ మెల్ల వానర విభూ బహు
చీకటి ముద్దయై నిరా
శాననయై భయంకర పిశాచ నిశాచర
కోటిలోఁ బడెన్॥ 21

ఈ కీకారణ్యము లే
చీకాకుగ పెద్ద చిక్కు చీకట్లై భూ
లోకంబు నింప మనుజా
నీకంబులు లేచె శాకినీ ఢాకినులై 22

దనుజుండై మనుజుండు గొప్పనటనా
దక్షుండుగా నేఁడు వే
యని వేషంబులు లేవు, మంజుల కళా
వ్యామోహినీ దివ్య వా
ణిని వాఁడాడని నాటకంబులును
లేనే లేవు నిక్కంబుగా
మొనగాఁడన్నిట దేవునై నను
కనుల్ మూయున్ నిమేషమ్ములో॥ 23

ముదిరిన మానవుండు జగముల్ తల్క్రిందులు
చేసి చేసి దు
ర్మదమున రావణుండయి సమస్త మహా మహు
లైన వారి సం
పద గొని తెచ్చి దిక్పతుల వాకిట కావలిబెట్టి
వాలిపై
కదన మొనర్చి వార్థి మునుగం గుఱుతేగద
వానర ప్రభూ. 24

ఆలములో మఱెంత ఘనులై పిడుగుల్
కురిపించినం నరుల్
వాలి బలమ్ము ముందు బలవంతులటే?
కనుఱెప్పపాటులో
నేలను రాచివైచు గమసించుము
వానరనాథ! యింక నీ
వేల నిరర్థకంబుగ గ్రహించితివో
నరకోటి నెచ్చెముల్॥ 25

ఎదురుగవచ్చి యెంత జగదేక పరాక్రమ
　　శాలివైన నో
ర్మైదప గలండె? వాలిబలిమిం నలిగ్గి నులిగ్గి
　　యెవండు కా
ల్కడపిన దిట్ట? వెన్క కపికాండము మొత్తము
　　తున్క తున్కలై
కద, విభు! ఋష్యమూకమున కాలము బుచ్చెను
　　జ్ఞప్తి యున్నదా? 26

ఇంత ముఖప్రీతిగ దృ
ష్టాంతరముల్ వచించి యవ్వానరుం డో
క్కింత కునుకు పట్టెను వి
భ్రాంతిగ సుగ్రీవుడేల స్వప్న జగత్తుల్॥ 27

నీలి ముసుంగు లతాంగి సన్నిధిని చేరి
చక్క చక్కని చుక్కలు నిక్కి నిక్కి
చెమ్మ చెక్కలాటలకు లేచినవి, గ్రుడ్ల
గూబలకు చూపువచ్చి పక్కన నగినవి॥ 28

క్షుద్రగాడ్పులు కోతి కొమ్మమెచ్చి యాడి యా
డి చిటారుకొమ్మ నొడిసి పరుండె
గండు కోయిల గొంతు కొండలోయల దూరి
క్రూర మృగమ్మయి గుబులుపెట్టి
సెలయేటి కన్నీరు యలసి సొలసి క్రింద
నిస్పృహతో నిట్ట నిల్వున పడె
అడవి పందులు పెద్దపులులు కలియబడి
పిరికి జీవాలను బెదరగొట్టి
పుట్ట పగిలించుకొని బుస్సు కొట్టుకొనుచు
నడికిరేయి పడగవిప్పె నాగరాజు
ప్రేయసిని బాసియున్న సుగ్రీవు డపుడు
విధి విధానమ్ము వేసవి ప్రేల్చెనేమొ॥ 29

ఆ విధ మర్ధరాత్రి విలయంబయి భార్యను
బాసియున్న సు
గ్రీవుఁడు మూర్ఛలో మునిఁగి కీడు ఘటిల్లెడి
స్వప్నలోక సం
భావనతో నులిక్కిపడి వార్ధి గభిక్కున
పద్మమాడ్కి ని
ద్రావకుఁడై పడెం బగిలి దద్దరిలం
వన ఋష్యమూకముల్॥ 30

శల కులిక్కిపడి పడిన శతన నదరి
ప్రక్కనున్న కోతి బెదరి పడఁగ క్రింద
త్రుళ్ళిపడి లేచి సుగ్రీవుఁ డొళ్ళు దులుపు
కొని పడిన వానరుని యెత్తుకొని చెనెదయ॥ 31

భళ్లున తెల్లవారినది ప్రాగ్దిశ పండిన
పండువోలె రా
జిల్లెను; బాల భానుఁడు ప్రసిద్ధముగా
తొలికోడి గొంతుతో
జల్లెడఁ బట్టి పోసిన రసస్వర మంజుల
భావ భాగ్యముల్
పల్లవపాణి నింపెను ప్రభాత సతీమణి
పాలవెల్లియై॥ 32

వనవాసంబున కెంత డస్సినను విశ్వశ్రీప్రభుం డోర్చుచుం
డెనుగానీ; మధుమాస వేళ నిజపత్నిం బాసి యిక్కాన నొ
క్క నిమేషమ్ము యుగమ్ముగా గడపి, మైకాంతిచ్ఛటల్ తప్పియుం
డిన సందర్భములో మహత్మ్యతుఁడు కన్నీరోడ్చె మున్నీరుగా॥ 33

రామా! సర్వధరాపురందర ధనప్రాకార
లక్ష్మీ ఘన
శ్యామా! యెంత జగన్మనోహరుఁడవో స్వామీ!
వసంతాగమం
బై, మేనంతయు కానలో వడిలి యెట్లుల్లాడెనో
కానవే
మీ? మాసీతమ తల్లి యిన్నిటుల స్వామీ!
వాడి పోనిచ్చునా? 34

అడవుల్ నీయడుగుల్ స్పృశించి బహు
రమ్యంబైనవో రామ! ఆ
అడవుల్ మేలిమెఱుంగు లేఁత గుబురుల్
హ్లాదమ్ముతోఁ దొడ్గి నీ
యెడఁదం బెన్నుపదం గదల్చినవి స్వామీ!
రామచంద్రప్రభూ!
పడలే నింత కృతఘ్నతా కుటిల తత్వ ప్రౌఢ
గర్వోగ్నతుల్॥ 35

రఘురామా! నవనీత కోమల శశారాకేందు
సుస్నిగ్ధ నా
మ! ఘనంబైన త్వదీయ ప్రేమకతనం
మా జీవితారణ్యముల్
మఘవానోజ్వల రాజ్యవై భవములై
మాత్సర్య దుర్బుద్ధితో
నఘముల్ పూచె; సహించ కష్టము, తుఫానై
దుల్పెదం బంపుమీ॥ 36

పువులారా! నవులాట కేని రఘురాముండెప్డు
పల్లెత్తు మా
ట విరోధస్థులపైన వేయఁడు వృథాడంబాలు
కొట్టండు లే
జవనం బొల్కొడి మీపసిండి కులుకుల్
సైపంగ లేనింక స
ద్వ్యవసాయంబున డిగ్గి తత్ప్రభు పదాబ్జ శ్రీలు
సేవింపుడీ॥ 37

హొయలు మీ లయలు దుర్వ్యయములై పోకుండ
ప్రియమునే యిడుడి లతా వితతులార
కులుకు మీ తళుకు చిక్కులకు తెగులకుండ
నయ మొనర్పుఁడు ప్రసూనంబులార
గుబురు మీ కబురు పెన్గుబురు పల్గాకుండ
సేదఁదీర్పుఁడు చెట్టు చేమలార
భవము మీ రవముల రవములు కాకుండ
హాయినే యిడుడి విహగములార
భువన మోహనమూర్తి వసుధైక
మేరు గంభీరమూర్తియై మెఱసి నేఁడు
ధర్మ సంరక్షణార్థమ్మ తరలినాఁడు
కాముకుఁడు కాఁడు రాముఁడు కనులార॥ 38

ఓసి ద్విరేఫమా! వదరకోసి
చెవుల్ చవులే త్యజించె; రా
కాసిగ లేచినావు రసికత్వము చాలు
ప్రసూన చుంబితా
భ్యాసము నేఁడు పెద్దగలభాలకు
పాదయిపోయె, నీదు సా
వాసము వట్టరిచ్చట దివాలయి పోగదె
గుండుసున్నతో॥ 39

ఇమ్మెయి గొంతు చించుకొను టెందులకే
చెవి చెంత కోకిలా !
పొమ్మెటువె పుక్కైన పువుబోడులలో,
గులుకొంగవచ్చు, ధ
ర్మమ్ముగుఱించి విశ్వనృపమందను లిచ్చట
జీవితంబు త్యా
గమ్మొనరించుచుండిరి జగమ్ము యుగమ్ము
మొగమ్ము మార్చగా॥ 40

వనలక్ష్మి ! మధుమాస భాగ్యములతో
త్వద్దివ్య సంతాన జీ
వన సౌఖ్యంబులతో విలాసముగ సంబాళింతువే
గాని, భూ
జన సంసేవ్యులుగా వెలంగి యిటు లశ్రాంతంబు
విశ్రాంతి లే
క నిరాధారులుగాఁ జరించెడి జగత్కల్యాణులం జూడవా॥ 41

ఓ కాంతారము ! నా నుదుల్ చెవికి
నీ కొక్కింతయే నెక్కెనా?
నా కంఠమ్మె యరణ్యరోదనయి చింతాక్రాంత
నీ కెక్క లే
దా? కర్కోటక భీకరాటవి! వృథాయై
పోయెనా నా వెతల్
నీ కాఠిన్యము లెక్కబెట్టనిక ఖండింతుంజుమీ
చూడుమీ॥ 42

హనుమంతుం డిట్లని త
ద్వనరుహ నివహాలపైన బడి కొమ్మలు తు
త్తునియలు చేసాగ శకుం
త నికాయమ్ములు బదా బదలు చేసె దిశల్॥ 43

అక్కడపుడు జమిలి ముక్కాలి దొరలెల్ల
చిర్రు బుర్రులాడి తుర్రుమనిరి
పరిమళాలతోడ పడె పుష్పవర్షమ్ము
రామ లక్ష్మణుల శిరస్సుపై గ॥ 44

ధరకుం బండెడి భాగ్యరాశి పలు
పెత్తందార్లు భూమందులం
దటు ఉంచెం చినరామచంద్రుఁడు
సమస్త త్స్మాత లాభ్యతు లె
ల్లరికిం గిట్టక పెద్దయల్లరుల పాల్గాబట్టి
నేఁడిట్టి భీ
కర ఘోరాటవి దైత్యమాయులను
సౌఖ్యశ్రీలు గోల్పోయెరా॥ 45

అడవులు వట్టి యీ బ్రతుకు లన్నియు
దారియు తెన్ను లేక పె
ల్లిడుమలలోన నల్గి పడి యేడ్చెడి
హేతువు లెల్లమార్చి యి
ప్పుడమిని స్వర్గభూమి సిరిపూచుట కుం
చలువల్ చిగిర్చు దే
వుడు రఘువీరమూర్తి పడుచున్న శ్రమల్
తిలకించరా కపుల్॥ 46

విశ్వ సంసార క్షేత్రైశ్వర్య హర్మ్యమ్ము
బ్రహ్మాండముగ నిల్పవచ్చి నజుఁడు
ధనగర్వ దున్మదాంధ ప్రతాపము పటా
పంచలుసేయ నేతెంచినతఁడు
క్రూర శార్దూల సంచార ఘోరాటవి
దివ్య వనమొనర్ప దిగిన బుధుఁడు
బృందావన పవిత్ర మందాకినిని డించి
కనకాభిషేక భాగ్యమిడు ఘనుఁడు
స్వార్థబుద్ధి మఁదిరిన ప్రపంచప్రజకు
గిట్ట కీనాఁడకట చేరె నట్టడవికి
మీరు నోర్వరాయింత బంగారుతండ్రి
మోసమే యెఱుగని మోడు మోకలార॥ 47

భూసుత యంచుఁ బేర్వడసి
పాల్పెసలారెడి యీ సమస్త ధా
త్రీ సముదాయ సంపద విధేయతగా
ప్రజదే యటంచు వి
శ్వాస గుణ ప్రసూనయయి జానకి
రామునివెంట దొడ్డయు
ల్లాసముతోడ కాఁడవులంబడె నక్కట
యెంతసాధ్వియో॥ 48

తీవ్రవాదవర్గ తీర్మాన నిర్మాణ
లాఘవుండు వీర లక్ష్మణుండు
ప్రేమ సింధువైన రామచంద్రుని వెంట
బంటువగిది వచ్చె భాగ్యమేమొ॥ 49

అదిగో! ఆతఁడు. తమ్ము డన్న నదిగో
అల్లాను ముద్దైన సం
పదలం బూచు పతివ్రతా తిలక మన్నం
రామచంద్రుండు వి
శ్వ దయాంభోధిగ సామ్యవాదమును
సంస్థాపించగా తద్విధే
య దళాలన్నిటి గూర్చినేఁడు పయనంబైనాఁడు
సేవింపుఁడీ॥ 50

అమితోత్సాహముతో సమస్త ధరణీ వ్యామోహినీ భాగ్య ర
త్న మృగీలోచన మౌళిభూషిత కళాతన్వంగియై దేశ దే
శ మణుల్ సందున గుల్కు వేళను ప్రతిజ్ఞం సామ్యవాద ప్రభు
త్వముకై రాముడు వల్లకుండెను మహీపట్టాభిషేకమ్మురా॥ 51

సౌమ్యమైన సరణి సామ్యవాద విధమ్ము
గద్దెకెక్కనీని పెద్దతలలు
రాజ్యమెల్ల లాగి రామభూపాలుని
నట్టడవికి నేఁడు నెట్టిరకట॥ 52

ఆ త్రిజగన్మనోహర కిశోరుఁడు లేని
పల్లె పట్టణా వైభవము లేల?
ఆ క్షీరసాగర వక్షస్థలుఁడు లేని
లక్ష సంఘాల సంరక్ష లేల?
ఆ కోమలతర సౌఖ్యవచోధనుఁడు లేని
హితమైన మలయ మారుతము లేల?
ఆ నిర్వక్ర పరాక్రమాఢ్యుఁడును లేని
కోటి ధనుర్ధరుల్ తోటి యేల?

ఆ మహానుభావుఁడు లేని సీమలోన
ఇంత ఆజాను బాహువు లేల? ఆ య
ఖండ బ్రహ్మాండ సుస్వరూపుండు లేని
పుడమి నీ క్రుళ్ళిపోయెడి బొమికలేల? 53

ఆ జగదేకమోహన కళామృతమూర్తి యెడందరాపిడుల్
నా జడజన్మ చూచి భువనమ్మున కాలముఁబుచ్చు చుండెనే
మో! జముఁడేడి? నా బ్రతుకు మొండెముకంఠలు తీయడేమి? యో
భూజములార! యో ప్రళయ భూతములార క్షమించఁబోకుఁడీ॥

అని మారు తాత్మజుండటు
తన కంఠమ్మున కిఁక నురిత్రాడు గల తలన్
బెనవేసుకొనెడి తఱి ల
క్ష్మణుండరిగి పట్టుకొని కపులం బిలచెన్॥ 55

వానరులు తటాలున క్షాత్మ
జాని దరికి దూకి, పెద్ద సంక్షోభముతో
కానకు కానను లేపఁగ
దానికి దాశరథి లేచి త్వరగా చనియెన్॥ 56

ఉరికుచ్చుం మెడకుం బిగించుకొని పెల్లున్నాద కంఠమ్ముతో
మరుతాత్మియుఁడు ఋష్యమూకమును ధూమస్తోమ కీలాలయాం
తరపాథోధిని గల్పుచున్న తఱి సీతా రామచంద్రుండు బం
ధుర గంభీర కృపారసార్ద్ర ఘనసింధుండౌచు నోదార్చెరా॥ 57

హానుమన్నా! ఇదియే మ
న్న? నరాధముఁడై నవాని నాటకమన్నా
వినుమన్నా నేనుండఁగ
చనునే నీ కాత్మహత్య చల్లని హానుమా॥ 58

ఇటులౌ దార్ఢ్యముతో మరుత్సుతుని భూమీశుండు వారించి ది
క్తటముల్ గోలను సర్దుచున్నతఱి తత్కల్లోల మీక్షించి, య
చ్చట సుగ్రీవుఁడు గాబరాపడి భుజస్కంధంబుపైనున్న మ
ర్కటముం నేలను గూల్చి వాలి కపటాంకంబంచు పర్వెత్తెరా॥ 59

కపివిభుఁడమ్మెయిం బెదరి గాబరతో తన మూపునున్న త
త్కపిఁ బడవైచిపోగ భయకంపితుఁడై కపిలేచి, కోసలా
ధిపతులు మారుతాత్మజు వధించుటకే ప్రయతించిరంచుఁ గాం
చి పరుగువెట్టి యాకథను జెప్పెను తత్కపిరాజ మౌళితో 60

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ